# మత్తవిలాసము

(మహేంద్రవిక్రమవర్మకృతికి తెనుఁగు)

అనువాద –

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

౧౯౩౫

(చంద్రికను పునర్ముద్రిత

# తొలిపలుకు

మత్తవిలాస మను పేరు గల ప్రహసన మిది. మహేంద్రవిక్రమవర్మ యని పేరెన్నికగన్న పల్లవమహారాజు (క్రీ. శ. 7-వశతాబ్ది పూర్వభాగము రాజ్య మేలినవాడు) రచించినది. ఇప్పటికి దొరకిన ప్రాచీనసంస్కృతప్రహసనములలో నిది రెండవది. తొల్తటిది భగవదజ్జుకము. దానికంటె నిది సర్వవిధములను దర్వాతిదే. భగవదజ్జుకము బోధాయన ప్రణీతముగాఁ గానవచ్చుచున్నది. కాని యదికూడ నీ మహేంద్రవిక్రమవర్మ యాస్థానిలో రచితమయ్యోనేమో యని యనుమానించుటకు సాధనలేశము లున్నవి. ఈ ప్రహసనములోని శ్లోకమును——

“పేయానురాప్రియతమాముఖమీక్షితవ్యం।
గ్రాహ్యా స్స్వభావలలితోఽవికృతశ్చ వేషః।
కే, నేద మీదృశ మదృశ్యత మోక్షవర్త్మ।
దీర్ఘాయురస్తు భగవాన్ స పినాక పాణిః॥”

అనుదానిని యశస్తిలక చంపువులో సోమ దేవసూరి (క్రీ.శ. ౯౬౦ నాఁటివాఁడు) భాస రచితముఁగా బేర్కొనియున్నాఁడు. (౨ భా. ౫ ఆశ్వాసము, నిర్ణయసాగరప్రతి, పుట ౨౫౧.) బౌద్ధ కాపాలిక పాశుపత మతముల వారి యసభ్యవర్తనము లిందుఁ బ్రదర్శింపఁ బడినవి. ఏతత్ప్రహసన రచనాకాలమున నా మతములవారి కట్టి యవనతగతి కలిగియుండ వచ్చును. ఉపనిషత్తులు, భారతము, బ్రాహ్మణులు, కాంచీపురి, రాజకులికులు, ఇందు పొగడ్తగనిరి.

కాంచీపురము వైభవ మిందుఁ గొంత వర్ణిత మయినది. అక్కడ ‘రాజవిహార’ మని

యొకబౌద్ధ విహారము ధనదాససెట్టి యను వాఁడు వెలయించినది కలదని, ఏకామ్రము (ఒంటి మామిడి) కలదని, పూర్వస్థలీ నివాసి యీశ్వరుఁడు కలఁడని యిందుఁ జెప్పఁబడినది.

చిత్రకలాకుశలుఁడును బహు ప్రఖ్యాతుఁడు నగు మహారాజు రచించినదన్న గౌరవమును బట్టి చరిత్రోపయుక్తమగునన్న యాశనుబట్టి చిరకాలమునకు ముందె దీనిని నేను దెలిఁగించితిని. ఇదికూడ భగవదజ్జుకముతోపాటు వెలయఁదగినదే యన్నతలఁపున నిపుడు ప్రకటించితిని.

వేటూరి ప్రభాకరశాస్త్రి

# సవరణలు

పుట పంక్తి సవరణ

20. 15 అవును; వీతరాగుడవయితివా వీత
రోషుడవూ కావలసినదే !

25. 16 స్వామీ ! ఈ భిక్షాపాత్రమును
చూడవెందుచేత? చెప్పవయ్యా
దీని రంగేమిటో ?

28. 11 … … చక్కగా-అనేక విహారాల్లో
భోగభాగ్యా లనుభవిస్తూ …

29. 16 … ఊరబండి నెక్కి-

# మత్తవిలాసము

## మహేంద్రవిక్రమవర్మ ప్రణీతమునకు
## తెనుఁగు.

---

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సీ. ఆకార వేష భాషా కార్య గుణముల
  వలన నెన్నే భేదములు ఘటిల్ల,
వానిచే వివిధ భావావేశములు గల్గ,
  బహురసాస్పదముగాఁ బరగుచున్న
త్రైలోక్యవర్తనాత్మకమా నఖండన
  ర్తనమహోత్సవము నిరంతరాయ
మగునట్లుబోధమాహాత్మ్యాభిరాముఁడై
  నిర్వహించుచుఁదానె సర్వమునకుఁ
గడఁగిమరలఁ బ్రేక్షకత్వమ్మువహియించి
యోలగించు నా కపాలపాణి

భవ్య మవనిభాజనవ్యా ప్తమగు యశ
మెపుడు మీ కనుగ్రహించుగాత !

ఓహో! సవతియని నా చిన్న పెండ్లము మీఁద ద్వేషము పెట్టుకొన్న నా పెద్దపెండ్లమును సంతోష పఱుచుటకుఁ జక్కని సందర్భ మిప్పుడు నాకు సమకూరినది. ఏమనఁగా, నిన్నాళ్లకు మన్నా పారిషదులు నాటక ప్రయోగాధికారమున నియోగించిరి. కనుక నిఁక నా పెద్ద పెండ్లమును జేరఁబోయెదను. (నేపథ్యాభిముఖుఁడుగాఁ జూచి) ఆర్యా! ఇటురమ్మా.

నటి:—(ప్రవేశించి రోషముతో) ఏమండీ! ఓహో! ఇదేమిటండీ! ఇంతకాలానికి, యవ్వనగుణభర మత్త విలాస ప్రహసనాన్ని చూప వచ్చారా యేమిటి?

సూత్ర:—ఔను, నీ వన్నట్టే.

నటి:—అయితే ఆవిడతోటే ప్రదర్శించుకోండి, మీతో అచ్చట్లూ ముచ్చట్లూ ఆడవలసింది ఆకేగాదా!

సూత్ర:—నీతోఁగూడి ప్రదర్శింపవలె నని నా కోరిక.

నటి:—అయితే నాతోగూడి ప్రదర్శించడానికి ఆమే అనుజ్ఞయిచ్చిందా యేమిటి మీకు?

సూత్ర:—ఔను నిజమే. మఱి కూడ నీ పక్క డికిఁ జేరెదవేని గొప్ప యనుగ్రహమును బొందఁ గలవు.

నటి:—అటువంటివి మీరేగదా పొందదగ్గవారు!

సూత్ర:—భవతీ! నీవు మాత్ర మేల పొందఁ దగవు? నీ ప్రయోగచాతుర్యమును జూచి పరితో షించి పారిషదులు ని న్ననుగ్రహింతురంటిని!

నటి:—(సహర్షముగా) ఆలాగా! అయితే సరి! ఇప్పటికి నాకు ఆర్యమిశ్రుల ప్రసాదము లభించింది.

సూత్ర:—లెస్సగా లభించినది

నటి:—అయితే ఇక నిప్పుడు ప్రియవార్త చెప్పి నందుకు మీకు ఏమి బహుమానం ఇచ్చుకోనేది?

సూత్ర:—ప్రియాఖ్యాన బహుమానమును గూర్చి పొన రుక్త్యమేల? చాలు! చూడు!

ఉ. భామిని! చెక్కుటద్దముల

పైఁ బులకల్ మొలకెత్తెఁ,గన్బొమల్

వామములై రహించె, జిగి

వాతెఱపై నునునవ్వు వెన్నెలల్

ప్రామికొనెన్, సుదుర్లభపు

భాగ్యము నాకిటువంటి నీదు నె

మోక్షము లభించెఁ జెందఁదగు
భోగ్యము నాకిఁక నేమికల్గెడిన్.

నటి:—అయితే తమరిప్పుడు ఆడవలసిందేమిటి ?

సూత్ర:—నీవే పేర్కొంటివిగదా ! 'మత్తవిలాస ప్రహసన' మని ;

నటి:—నిజంగా ! నా కోపానికి తమరి మీద పక్షపాతం ఉన్నదిసుమండీ ! ఏమంటే మీ అభిప్రాయానికి అనుగుణంగానే నా కోపం నన్ను మాటాడించింది. ఔనండీ ! కవీశ్వరుఁ డెవరు ఆ కృతి రచించి ప్రశస్తి కెక్కినవాడు ?

సూత్ర:—భగవతి ! వినుము. పల్లవకుల ధరణీ మండల కులపర్వతమును, సర్వ నయ విజితసమస్త సామంత మండలుఁడును, ఆఖండలసమ పరాక్రమ సంపన్నుఁడును, సంపన్మహిమానురూప దాన వైభవ పరిభూత రాజరాజును, నగు శ్రీ సింహవిష్ణువర్మకు పుత్త్రుఁడు శత్రుషడ్వర్గ నిగ్రహపరుఁడు పరహిత పరతంత్రతచే మహాభూత సమానధర్ముఁడు మహేంద్ర విక్రమవర్మ యని మహారాజు కలఁడు. మఱియు

శా. కాంతిప్రౌఢి వితీర్ణి సూనృత కలా
కౌశల్య దాక్షిణ్యవి

క్రాంతిశాంత్యనుభావముఖ్యగుణముల్
కా లిక్కలిఁ నిల్ప నే
శాంతఁగానక మొత్తమై శరణ మా
భూపాలునిం జెందెఁ గ
ల్పాంతంబం దఖిలాది నీశ్వరుని న
వ్యైస్సృష్టి గన్నట్లుగాఁ.

ఇంకను,

క. ఘన సుగుణ సూక్తి మణి గణ
ఖనియయ్యునతండువిలువగల్పించుఁజుమీ
తనయొద్ద లఘుగుణములై
నను సుజనులసూక్తులకుఘనంబగు పేర్మిఁ

నటి:—తమ రిప్పుడు జాగు చేస్తా రెందుకు? సరిక్రొత్తది గాబట్టి యీ ప్రయోగాన్ని వెంటనే సాగించవలెను.

సూత్ర:—నేను, సుమా!

తే. సరససంగీతధనుఁడనై సాంప్రతంబు
కవిసుగుణకీర్తనముచేతఁ గట్టువడితి
(నేపథ్యమున) ప్రియా! దేవసేనా!

సూత్ర:—చెలియా! నేఁగూడ మద్యమున్నఁ జేత నిటక
పాల విభవుండయిన యీ కపాలివ్రాలె.
నిష్క్రమించిరి.
ఇది స్థాపన.
(అంత భార్యతో కపాలి ప్రవేశించును.)
కపాలి:—(మత్తునటించి) చెలీ దేవసోమా! సత్యమే సుమాఇది! తపస్సుచేత కామరూపము ధరింపనగున నుట; ఏమనఁగా నీవు యథావిధిగాఁ బరమవ్రతము ననుష్ఠానము చేసితివి. కనుకనే క్షణములో అనన్యమ యిన రూపాతిశయము నందితివి! నీకు,

సీ. చెలువారెమోముపైఁ జెమటచిత్తడిజల్లు,
పెల్లువిలాసముల్ వెల్లివిరిసె
భ్రూలతావిభ్రమంబులు వింతలై తోఁచె
నవ్యక్తవర్ణంబు లయ్యెఁ బలుకు
లెట్టిహేతువులేని యట్టహాసము మీఱె
నక్షియుగ్మక మెఱ్ఱనై రహించె
తారకంబు లధీరతరళంబులై పొల్చె
నలసతం బొరసె నవాంగయుగము,

తే. సడలెఁ గ్రుమ్ముడి చిందఱై సాఁగి రెండు
మూపులంబడి వ్రేలాడె మూర్ధజములు
సరుల పువ్వులు జాఱఁగా సొరుఁగుదార
మూఁగుచున్నది చాఁగు రే! చాఁగు! బాగు!

దేవసోమ:—స్వామీ! మత్తురాల్నిగా ఉన్నత్తు రాల్నిగా నన్ను భావిస్తున్నారు మీరు!

కపాలి:—ఏమంటివి నీవు?

దేవసోమ:—నే నేమీ అనలేదే!

కపాలి:—అయితే నాకు మత్తెక్కేనా యేమి?

దేవసోమ:—సామీ! గిరగిర తిరుగుతోంది, గిర గిర తిరుగుతోంది, పుడమి. ముందుకు పడుతున్న ట్టున్నా! పట్టుకోండిప్పుడు నన్ను;

కపాలి:—చెలీ, అట్లేపట్టుకొనుచున్నాను. (పట్టు కొనుచున్నవాఁడై పతనము నిరూపించి.)

ప్రేయసీ! దేవసోమా! ఏమి నీకు కోపము వచ్చెనా? పట్టుకొనవచ్చుచున్న నన్నుఁ దొలఁగి ంచుచుంటివి?

దేవసోమ:—అవునబ్బా! సోమదేవకు కోపమే వచ్చింది. సామి తలతో దణ్ణం పెట్టి బతిమాలుకుం టున్నా దూరంగానే ఉంటోంది.

కపాలి:—ఓమె ! నీవు గాదటవే సోమదేవవు ? (కనుమూసిచూచి) కాదు దేవసోమవు.

దేవసోమ:—సామీ ! అంత నేస్తకత్తెగామల్లు ఆ సోమదేవ మీకు ; పనికిమాలిన నాపేరితో పేరు కొంటారెందుకు ? అలా పేరుకోకండి ;

కపాలి:—భవతి ! నామత్తు కొంచెం మాట తబ్బిబ్బు చేసినది. అది నీయెడల నిష్ఫ డపరాధమ యినది.

దేవసోమ:—పోనీండి- మంచిది- అపరాధము మీది గాదు.

కపాలి—ఛీ ! ఏమీ ! మద్యదోషము నన్నిట్లు మార్చివైచుచున్నదా ! కానీ ! కానీ ! ఇదిమొదలు నేను మద్యనిషేవణము మానివైచెదను.

దేవసోమ:—సామీ ! వద్దు వద్దు. నామూలాన వ్రతభంగం చేసుకుని తపస్సు చెఱుచుకోవద్దు. (పాద ములపైఁ బడును.)

కపాలి:—(సంతోషముతో లేవనెత్తి కాఁగిలించు కొని.) ధర్మణ్ణ ధర్మణ్ణ ! నమశ్శివాయ, ప్రేయసీ !

మత్త.కల్లుద్రాగవలెఁ, బ్రియాస్యము
గన్గొనఁగావలె, సాజమై

చెల్లునట్లు వికారవేషము
 చేకొనఁగ వలె, నంచు ని
ట్లొల్లఁబోవక మోక్షమార్గము
 నొప్పి కన్గొనినట్టివాఁ
డల్ల వేల్పు పినాకపాణిచి
 గాయువై జయమందుతన్.

దేవసోమ:—సామీ ! ఇట్టా అంటారేమిటి ? అర్హ
తులు మోక్షమార్గాన్ని వేఱుగా సర్దిస్తారాయెను ?

కపాలి:—ఔనే, వాండ్రు మిథ్యాదృష్టులుగదా !
ఏమనఁగా.

తే. కారణగుణంబునిజముగాఁగార్యమునకుఁ
 జొప్పడుట హేతువుల చేతనొప్పుకొనియు
 గ్రుడ్డికుంకలు దమమాట కడ్డముగ నె
 దుఃఖకార్యంబు సుఖమటందురు మఱియు
 [ను ;

దేవసోమ:—హరహర ! శాంతం పాపమ్.

కపాలి:—శాంతం పాపమ్, ఆక్షేప ముఖమున
నైనను ఆ పాపిష్ఠుల పే రెత్తరాదు. వాండ్రు
బ్రహ్మచర్యము, కేశముండనము, మలధారణము, భోజ

నవేళా నియమము, మలినవస్త్రపరిధానము మొదలయిన పాడుపనులచే ప్రాణులను బాధించుచుందురు. కాఁబట్టి నేనిప్పుడు కుతీర్థ సంకీర్తనముచే పంకిలమైన నా జిహ్వను మద్యముచేఁ బ్రక్షాళనము చేసికొనఁ గోరుచున్నాఁడను.

దేవసోమ:—అయితే మనమిప్పు డింకో కల్లు దుకాణానికి వెడదాము.

కపాలి:—ప్రేయసీ! అట్లే పోవుదము.

(ఇర్వురును బరిక్రమింతురు.)

కపాలి:—ఓహోహో! ఓహోహో! విమాన శిఖరములపై మబ్బులువిడిసె యుఱుముచున్నవో యన్నట్లు మృదంగములు మ్రోగుచున్నవి. వసంతసమయముఁ బుట్టుకకుఁ దల్లిపట్లో యనునట్లు పూలయంగళ్లున్నవి. కుసుమశరవిజయ ఘోషణములో యనునట్లు వరాంగనల కాంచీరవము లున్నవి. ఏమి యీ కాంచీపురము వైభవము!

చ. అనతిశయం బనంతమును

నప్రతిబంధమునైన సౌఖ్యముఙ్

మునివరు లాత్మబోధపరి
పూర్ణులు ముం దెదిగాఁ దలంచిరో
వనితరో చిత్ర మియ్యెడ న
వారిగ నయ్యది గానవచ్చెడిన్
దనరఁగ గామభోగమయ
తన్ సకలేంద్రియ చర్వణీయతన్.

దేవసోమ:—సామీ! కల్లమ్మువారికి మల్లే యీ కాంచీపురికికూడా మాధుర్యం వెగటులేనిది;

కపాలి:—ప్రేయసీ! చూడు, చూడు, ఈ కల్లు దుకాణము యజ్ఞశాలను బోలి యున్నది. ఇక్కడ జెండాకంబము యూపస్తంభము; సుర సోమము; త్రాగుఁబోతులు ఋత్విజులు; త్రావుడుదొప్పలు చమసములు; కలుకుట్లు మొదలయిన నంజుళ్లు హవిర్విశేషములు; కైపుకూఁతలు యజుస్సులు; తందాన పదములు సామగానములు; ఉదంకములు స్రువములు, దాహాము అగ్ని; అంగడివాఁడు యజమానుఁడు.

దేవసోమ:—మనకుకూడా ఇక్కడ భిక్షం రుద్రభాగం అవుతుంది.

కపాలి:—ఓహో దర్శనీయములుగదా ఈ మత్తవిలాస నృత్యములు; వీరుగో నర్తకులు మద్దెళ్లే దరువు

లకు ఒద్దికగా అనేకవిధములయిన యాంగవిక్షేపములు, బొబ్బలార్పులు, బొమ్మమార్పులు నెఱపుచున్నారు. ఒంటిచేతులతో నుత్తరీయములను బైకెత్తి పట్టియార్చుచున్నారు. కంఠగుణములు కంగారుకాఁగా కట్టుబట్టలు పట్టుపీడఁగా సరిపఱచుకొను సందర్భములందు లయలఁ దప్పుచున్నారు.

దేవసోమః—బలేరసికుడు సుమా ఆచార్లు.

కపాలిః—ఇదిగో భగవతి! మదిర దొప్పలలో దైవాఱుచున్నది. అందచందములకు నలంకారములకు నిది ప్రత్యాదేశము. పొలయలుకలుగొన్న పొల్తులకిది యనునయము. పడుచుఁదనమున కిది పరాక్రమము. బరవసముల కిది ప్రాణము వేయేల?

చ. మదనునిమూర్తి, మున్ త్రిపుర
మర్దను చిచ్చుఱకంటి మంటచేఁ
బదడయి పాడువాఱె నని
పల్కుదురయ్యది తప్పుఁబల్కు; నాఁ
డది ద్రవియించె స్నేహమయ
మౌటను దన్నయనాగ్నిసోఁకఁ గా
మదిర యదేసుమా సుదతి!
మత్తిలఁజేయు నొకెత్తచిత్తముల్

దేవసోమ:—స్వామీ! బాగాచెప్పితిరి! లోకో పకారనిరతుడయిన లోకనాథుడు లోకాన్ని నాశ పఱుస్తాడామతి?

(ఇద్దఱును జెక్కిళ్ల తప్పెటలు వాయింతురు.)

కపాలి:—భవతి! భిక్షాం దేహి!

(నేపథ్యమున.)

సామీ.—ఇదుగో బిచ్చం! పుచ్చుకోండి సాములు!

కపాలి:—ఇదిగో ప్రతిగ్రహించుచున్నాను. ప్రే యసీ! ఎక్కడ నా కపాలము?

దేవసోమ:—నాకూ కనపడలేదు.

కపాలి:—(కనుమూసి యోచించి) ఆఁ! ఆ కల్లు దుకాణముకడనే విడిచి మఱచిపోయితి ననుకొందును. కానీ తిరిగివెళ్లి వెదకుదము.

దేవసోమ:—సామీ! అధర్మం గాదా యిది? ఆదరంతో పెట్టవచ్చిన బిచ్చం అందుకోక పోవడం? ఇప్పు డేమిటి చెయ్యడం?

కపాలి:—ఆపద్ధర్మము ను ప్రమాణీకరించి గోవు కొమ్ముతో ప్రతిగ్రహింపఁదగును.

దేవసోమ:—సామీ ఆలాగే. ప్రతిగ్రహించును. (ఇద్దఱు పరిక్రమించి చూతురు.)

కపాలి:—ఇక్కడఁ గూడఁ గానరాకున్నదే! (విషాదము రూపించి) ఓహో! మాహేశ్వరులారా! మాహేశ్వరులారా! మాభిక్షాభాజనము నిక్కడ మీరు చూచితిరా? ఏమంటిరీ మీరు? మేము చూడలే దంటిరా? అయ్యో చెడితిని. నాతపస్సు చెడినది. ఇప్పుడిఁక నే నెట్లు కపాలిని కాఁగల్గుదును. అయ్యో! దురవస్థ.

ఉ. పానమువేళ దొప్పయయి,
భాజనమై భుజియించువేళ, ని
ద్రానుభవంబువేళ నుపధానమునై,
యిటులింతదాఁక నెం
తే నుపకారముం జలిపె నిట్టి
కపాలముపోక నా కయో
ప్రాణసమానమిత్రు నెడఁబాటు
తెఱంగున వంతగూర్చెడిన్.

(క్రిందబడి తల మోదికొనుట రూపించి) కలదు లక్షణమాత్రము! కపాలిసంజ్ఞ నాకుఁ బోలేదు. (లేచును.)

దేవసోమ:—స్వామీ! ఎవరూ మీకపాలాన్నెత్తుకుపోయింది?

కపాలి:—కలుకుట్లు దాసిలో నుండుటచే కుక్కగాని, శాక్యభిక్షువుగాని యెత్తుకొనిపోయి యుండవచ్చు ననుకొందును.

దేవసోమ:—అయితే దాన్ని పట్టుకోవడానికి కాంచీపురమంతా తిరుగుదాము.

కపాలి:—ప్రేయసీ! సరే.

(ఇర్వురుఁ బరిక్రమింతురు.)(అంతఁ బాత్రహస్తుఁడై శాక్యభిక్షువు ప్రవేశించును.)

శాక్యభిక్షువు:—అహో! ఉపాసకుడయిన ధనదాససెట్టిగారి సర్వావాస మహాదానమహిమ! ఆ మహాదాన మహిమచేత నాకు ఇష్టమైన రంగులతో ఇష్టమైన సువాసనలతో ఇష్టమైన రుచులతో నానా రకాలయిన మత్స్యమాంసాదుల వంటకాలు సాపడ గుదిరింది. ఇదుగో ఇప్పుడు రాజవిహారానికే పోతాను. ఆహా! పరమ కారుణికుడైన భగవంతుడు తథాగతుడు ప్రాసాదాలలో వాసము, చక్కగా పఱుపులు పఱచిన పట్టెమంచాలమీద పడక, జాము ప్రొద్దెక్కకటప్పటికే సాపాటు, మూడుజాములకు సురసాలయిన పానకాలు, జాజికాయ జాపత్రి యేలకులు లవంగాలు పచ్చకర్పూరము అని పంచసుగంధాలు గల తాంబూలము, సన్న పట్టుసెల్లా వస్త్రెవాటూ, ఉండ

వలె ననే ఉపదేశంచేత భిక్షుసంఘానికి మహోప కారం చేసికూడా ఇదేమిచెపుమా స్త్రీపరిగ్ర హము సురాపానము ఉండవలెనని గుర్తించలేక పోయినాడు. కాక ఆ సర్వజ్ఞుడు దీన్ని గుర్తించ లేక పోవడమేమిటి? నిశ్చయంగా చెడ్డముండ కొడుకు లీ ముదివయసు బుద్ధాచార్యులు మావంటి పడుచు వాళ్లమీద మాత్సర్యంచేత పిటక పుస్తకాలలో స్త్రీ సురాపాన విధానాలు తీసి పారవేసి ఉంటారనుకొం టాను. ఎక్కడ దొరకుతవి చెపుమా ఆ పిటకపుస్త కాలు సరియైన మూలపాఠాలతో; వాటిని గనక సంపాదిస్తినా సంపూర్ణమైన బుద్ధవచనాన్ని లోకంలో వెల్లడించి సంఘోపకారం జరిపినవాణ్ణౌతాను. (పరి క్రమించును.)

దేవసోమ:—సామీ! చూడు చూడు! అడుగో కాషాయ ధరుడు జనవత్తిడి కలిగిఉన్న రాచబాటలో ఒళ్లంతా కుంచించుకుని ఈపక్కా ఆపక్కా చూసు కుంటూ అడుగడుక్కూ అనుమానిస్తూ తొందరతొంద రగా వెళ్లుతున్నాడు.

కపాలి:—ప్రేయసీ! ఔనుసుమా! మఱియు వాని చేత ఏమిటో ఉన్నట్టుకూడ నున్నది. కాషాయమును పైఁగప్పిపెట్టినాఁడు.

దేవసోమ:—సామి! అయితే అడ్డం పోయి పట్టుకు పరిశీలింతాము.

కపాలి:—భవతి! అట్లే చేయుదము (చేరఁబోయి) ఓయి భిక్షూ! నిలు!

శాక్యభిక్షువు:—ఎవడు చెపుమా వీడు! నన్నిట్లా అంటాడు! (తిరిగిచూచి) వీడు ఏకామ్రవాసి దుష్ట కాపాలికుడా! కానీ; వీడి త్రాగుడుతబ్బిబ్బులలో తగులుకోకుండా తప్పించుకొంటాను. (వడిగా కడచి వెళ్లును.)

కపాలి:—ప్రేయసీ! అబ్బయ్య దొరకినది కపాలము! వీఁడు నన్నుఁ జూడఁగానే భయమెత్తి పర్వెత్తుచున్నాఁడు. ఆపరుగే సాక్షిసుమా వీఁడు అపహరించినాఁడనుటకు; (వడిగాఁ జేరఁబోయి ఎదుర్కొని అడ్డగించును.) ఓః! పోగరుఁబోతా! ఇంకెక్కడికోయి పర్వెత్తఁగలవు?

శాక్యభి:—కాపాలికోపాసక! తప్పుకో, తప్పుకో, ఏమిటిది? (ఆత్మగతము) బళే! అందగత్తెసుమా ఉపాసిక!

కపాలి:—ఓయిభిక్షూ! చూపవోయి! అదిగో నీ చేతిలో ఏమిటో కాషాయముచాటున కప్పబడి ఉన్నదీ, నేను చూడవలెను.

శాక్యభిక్షువు:—ఏమున్న దిక్కడ చూడడానికి? భిక్షాపాత్రగదాయిది!

కపాలి:—కనుకనే చూడవలసియున్నది.

శాక్యభిక్షువు:—ఆఁ! ఉపాసక! కూడదు కూడదు; దీన్ని చాటుపరుచుకొనే ఉంచుకోవలె మేము.

కపాలి:—అవును. ఇటువంటివాటిని చాటుపఱుచుకొనుటకే బుద్ధుఁడు మీకు బహు చీవర ధారణము నుపదేశించెను.

శాక్యభిక్షువు:—నిజమది;

కపాలి:—సరి! ఇదేమో సంవృతసత్యము. పరమార్థ సత్యమేదో పలుకుము.

శాక్య:—చాలు ఇంతటితో గేలి. అతిక్రమిస్తున్నది భిక్షావేళ; వెళ్లివస్తాను. (బయల్దేరును)

కపాలి:—ఆః! పొగరుఁబోత! ఎక్కడికేఁగెదవు? నా కపాలము నాకిమ్ము. (చీవరపుఁజెంగు పట్టుకొనును.)

శాక్య:—నమో బుద్ధాయ.

కపాలి:—'నమఃఖరపటాయ' అనవోయి! ఆయన గదా చౌరశాస్త్రకారుఁడు! కాక ఆ ఖరపటునికంటె ఈ యధికారమున బుద్ధుఁడే అధికుఁడు. ఏలనఁగా.

ఆ. ఉపనిషచ్చయమునుండి, మహాభార
తమున నుండి, యర్థతతి హరించి
విప్రు లరయుచుండనే ప్రతారణమునఁ
గోశసంచయమును గూర్చె నతఁడు.

శాక్యభిక్షువు:—శాంతం పాపం. శాంతం పాపం.

కపాలి:—ఈ విధముగా సద్వర్తనముగల తపస్వికి పాపము శాంతింపకేమౌను ?

దేవసోమ:—సామీ ! బడలినట్లున్నారు మీరు ! ఈ కపాలం సులువుగా మనకు ఓపట్టాన వచ్చేటట్టు లేదు. కనుక ఈ గోవుకొమ్ముతో కల్లుతాగి బలం తెచ్చుకొని తర్వాత వీడితో తగవులాడుదురు గాని.

కపాలి:—అట్లే కానీ.

(దేవసోమ కపాలికి కల్లు త్రాగనిచ్చును.)

కపాలి:—(త్రాగి) ప్రేయసీ ! నీవుకూడ శ్రమాప నోదనము చేసికొమ్ము.

దేవసోమ:— సామీ! అట్లాగే. త్రాగును.

కపాలి:—ఈతఁడు మన కపకారి ; అయినను, మనసిద్ధాంతమున సంవిభాగ ప్రదానము ముఖ్యమైయు న్నది. కనుక శేషము మీ యాచార్యున కొసఁగుము.

దేవసోమ:—సామి సెలవు ప్రకారము ; (భిక్షు వునుజూచి) సామీ గ్రహించండి !

శాక్యభిక్షువు:—(ఆత్మగతము) బలే! అభ్యుదయము సులువుగా లభ్బింది. పదిమందీ చూస్తారనేది వొక్కటే చిక్కు. (ప్రకాశము) అమ్మో! ఆఁ! ఆఁ! అట్లా అనవద్దు. మా కిది తగదు. (సెలవులు నాకును)

దేవసోమ:—ఛీ, పో, దౌర్భాగ్యుడా! చావు, ఇలాగంటి భాగ్యం నీ కెట్లా లభిస్తుంది.

కపాలి:—ప్రేయసీ! వీనిమాటతీరు లోనికోరికతో విరోధించుచున్నది సుమా! సెలవులు తడియుచున్నవి చూచితివి గదా!

శాక్యభిక్షువు:—ఇప్పుడు కూడ నీకుఁ గరుణకలుగదా?

కపాలి:—కరుణయే కలుగు నేని వీతరాగుఁడనెట్లగుదును?

శాక్య:—అవును వీతరాగుడవూ కావలెను వీతరోషుడవూ కావలెను.

కపాలి:—వీతరోషుఁడ నగుదును. నా సొమ్మునా కిచ్చివేసెదవేని.

శాక్య:— నీ సొమ్మేమిటి?

కపాలి:—కపాలము.

శాక్య:—కపాలమేమిటి?

కపాలి:—'కపాల మేమిటి' అనెదవా? అవును, అనకేమి?

ఉ. అప్పతి ధారుణీధర ధ
రాద్యములైన మహాపదార్థముల్
గొప్పగ నెప్పుడుం గనుల
కుం గనవచ్చుచునుండగానె తాఁ
దప్పు తలంపునంబడి త
థాగతుఁ డెల్ల నపహ్నవించె నా
యుప్పరుఁ బిడ్డ నెట్లెఱుఁగ
వల్పకపాల మపహ్నవింపఁగాఁ.

దేవసోమ:—సామీ! పట్టిదేవ్రరింపు మాటలకు ఇచ్చేవాడుగాడువీడు. వీడి చేతిలోనుండి బలవంతాన ఊడ బెరుక్కుపోదాము.

కపాలి:—ప్రేయసీ! అంతే చేయుదము. (ఊడఁ బెఱుకుకొనుటకుఁ దంటాలుపడును.)

శాక్య:—చావు! కాపాలిక ముండ కొడక! (చేతితో తోలఁగద్రోచి, కాలితో తన్నును.)

కపాలి:—ఏమీ క్రిందఁ బడిపోయితినా?

దేవసోమ:—చచ్చావు! లంజకొడక! (జుట్టు పట్టుకోఁబోయి అది దొరకక క్రిందఁబడును.)

శాక్య:—(ఆత్మగతము) భేషయినది బుద్ధుని విజ్ఞానము! బుఱ్ఱ బోడి చేయించుకొమ్మన్నాడు! (ప్రకాశము) లే! లే! ఉపాసికా లెమ్ము, (దేవసోమను లేవఁదీయును.)

కపాలి:—చూడుండి చూడుండి! మాహేశ్వరులారా! భిక్షునామధారి దుర్మార్గుఁడీ నాగసేనుఁడు నా ప్రియురాలి పాణిగ్రహణము చేయుచున్నాఁడు!

శాక్య:—ఆఁ! ఆఁ! ఉపాసక! అదికాదు. అదికాదు. చిక్కులలో పడ్డవాళ్లమీద దయ దలచడం మా ధర్మంగాదా?

కపాలి:—ఇదికూడ సర్వజ్ఞ ధర్మమా! ఓయీ! నేను ముందుగాఁ క్రిందఁ బడితినిగదా! కానీ! ఎందుకిది యెల్ల? ఇప్పుడు నీ శిరఃకపాలము నాకు భిక్షాకపాలము కాఁగలదు.

(అందఱు కొట్లాడుదురు.)

శాక్య:—సర్వం దుఃఖం దుఃఖం.

కపాలి:—చూడుండయ్యా మాహేశ్వరులారా! చూడుండి! దుర్మార్గుఁడీ భిక్షునామధారకుఁడు నా భిక్షాకపాలమును దొంగిలించి పైఁగా తానే గోలుపెట్టుచున్నాఁడు! అవును గాక! నేనుగూడ మొఱ్ఱలిడెదను. కుయ్యో! ఞా ఱ్ఱో! కుయ్యో! మొఱ్ఱో!

(అంతఁ బాశుపతుఁడు ప్రవేశించును.)

పాశుప:—సత్యసోమా! ఎందుకు ఏడ్చెదవు?

కపాలి:—ఓయి! బభ్రుకల్ప! దురాత్ముఁడు భిక్షునామధారకుఁడు వీఁడుగో నాగసేనుఁడు నాభిక్షాకపాలమును దొంగిలించి యియ్యనొల్లకున్నాఁడు.

పాశుపతుఁడు:—(ఆత్మగతము) మనము చేయఁదలఁచుకొన్న పని యదేదో! చెలఁగి దాని గంధర్వులే చేసినారు! ఈ దురాత్ముఁడు!

తే. చీవరాంతమ్మునను ముడిచికొని కాని
కానిపించుచు నా నేస్తకత్తెయైన,
క్షౌరికునిదాసిఁ దోఁకొని చనెడు నవ్వుర!
పిడికిటను మేఁతఁజూపుచుఁదోడుకుఁ బోలె.

కనుక నిప్పుడు ఎదిరి పక్షము నెక్కాలిపి నా శత్రుపక్షమును ధ్వంసపఱుచుకొందును. (ప్రకాశము) ఓయి నాగసేన! ఈతఁ డన్నది నిజమేనా?

శాక్య:—స్వామీ! మీరున్నూ ఇట్లా అంటారేమి? "అదత్తాదానమునుండి విరమణము శిక్షాపదము, మృధావాదమునుండి విరమణము శిక్షాపదము, అబ్రహ్మచర్యమునుండి విరమణము శిక్షాపదము, ప్రాణాతిపాతమునుండి విరమణము శిక్షాపదము, అకాలభోజనము

నుండి విరమణము శిక్షాపదము, మాకు; బుద్ధుణ్ణి బౌద్ధ ధర్మాన్ని, బౌద్ధసంఘాన్ని, శరణుచొస్తున్నాను''

పాశుప:—సత్యసోమా! వీరి నియమ మీలాటిది. దీని కేమి బదులు పలికెదవు!

కపాలి:—మాకును అనృత మాడరాదని నియమము కలదు గదా!

పాశు:—అదీ ఇదీ ఉభయము వాస్తవమే. ఇక్కడ నిర్ణయోపాయమేది?

శాక్య:—బుద్ధవాక్యాన్ని ప్రమాణీకరిస్తూ ఉన్న భిక్షువు సురాభాజనాన్ని దొంగిలిస్తాడనడానికి హేతువేమిటి?

పాశుప:—ప్రతిజ్ఞా మాత్రముచే హేతువాదికి కార్యసిద్ధి కలుగదుగదా!

కపాలి:—ప్రత్యక్షవిషయమున హేతువును జెప్పుట వ్యర్థము.

పాశుప:—ఏమి? ప్రత్యక్షమేనా!

దేవసోమ:—స్వామీ ఇతగాడు చేతిలో చీవరము చాటున దాచిఉంచాడు కపాలాన్ని.

పాశుప:—వినుచున్నావటయ్యా?

శాక్య:—ఓ స్వామీ! ఈ కపాలము పరకీయము కాదు.

కపాలి:— అట్లేని చూపవచ్చునుగదా!

శాక్య:—సరే.

కపాలి:—చూడుండీ, చూడుండి, మహేశ్వరులారా! కాపాలికుఁడు చేసిన యన్యాయ్యమును, భదంతుని సౌశీల్యమును;

శాక్య:—అదత్తాదానమునుండి విరమణము శిక్షాపదము—(ఇత్యాదిపూర్వపఠితమును మరలఁ బఠించును)

(ఇద్దఱుఁ జిందులు ద్రొక్కుదురు.)

శాక్య:—అక్క! లల్లా!! సిగ్గుపడవలసిన సందర్భంలో చిందులు ద్రొక్కుతున్నాడు!

కపాలి:—ఆఁ. ఎవఁడు నృత్యము చేయువాడు! (అంతటఁ జూచి) నష్టమైన నా భిక్షాభాజనమును మరలఁగనుఁగొనఁగలిగితి నన్న బులుపాటమను మలయమారుతము సోఁకఁగాఁ దలిర్చినది నా ప్రీతిలత. దానికి తోడిగిన మొగ్గతోడుగు నాకీ నృత్యబుద్ధి!

శాక్య:—స్వామీ! భిక్షాకపాలమిది కానరాకపోవడానికి కారణ మేమిటి? స్వామీ! దీని రంగేమిటో చెప్పవయ్యా!

కపాలి:—ఇఁక నిక్కడ చెప్పవలసిన దేమున్నది? నేను చూచితినిగదా కాకికంటె నల్లఁగానున్న దీకపాలము.

శాక్య:—కనుక నిక నీ కపాలము నాదే యగుట స్వయముగానే సమ్మత మయింది. (అని చూపును.)

కపాలి:—నిజముగా స్పష్టమయినది నీకు రంగు మార్పు చేయుటలోఁ గల నేర్పు; కనుము.

తే. తొలుత వెలిదమ్మి లేఁదూండ్లతుండ్లవన్నె
సాజమై నీవుతాల్చు వస్త్రమున కలరె
దాని కిప్పుడు నీచేతఁ దారసిలదె
మొదలియెఱసంజవన్నె యో మోసగాఁడ!

తే. మాయనికషాయమునలోన మఱివెలుపల
గప్పఁబడిన నీ చేతిలోఁ జొప్పడెనట!
ఓయి భిక్షువా! యింకఁ గషాయిత మ్మ
దేల కాకుండు నయ్యా కపాలకమ్ము?

దేవసోమ:—అయ్యో! చెడ్డాను! దురదృష్టురాల్ని, సర్వలక్షణసంపన్నమైంది, బ్రహ్మపుర్రెవంటి మహిమగలది, పున్నమ చందమామను బోలింది, కల్లువాసనతో గమగమలాడుతూ ఉండేది, ఈ కపాలం మురికి గుడ్డల బిచ్చగాడిచేత బడి ఇట్లా పాడై పోయింది! అయ్యో! (ఏడ్చును.)

కపాలి:—ప్రేయసీ ! చాలు ! చాలు ! ఏడు వను, మరల పవిత్రము కాఁగలదు. శ్రుతి చెప్పుచున్నది ; మహానీయపదార్థములకు ప్రాయశ్చిత్తములచేఁ బాపములు తొలఁగునని.

ఉ. దీక్షితుఁడై మహావ్రత మి
దేకద పూని శశాంకమౌళి పా
పక్షయముం బొనర్చుకొనె
బ్రహ్మశిరంబును ద్రుంచియుఁ, సహ
స్రాక్షుఁడు బ్రహ్మపుత్త్రుఁ ద్రిశి
రస్సును జంపియుఁ దొంటిమాడ్కిఁగా
నక్షయ పుణ్యముం బడసె
యజ్ఞశతంబునఁ బాప మాఱఁగాఁ.

ఓయి ! బభ్రుకల్ప ! అంతేకాదా !

పాశు:—శాస్త్రిసమ్మతము నీమాట.

శాక్య:—ఔనయ్యా ! నేను రంగువేశాను ; సరే, దీని సంస్థానపరిమాణమును నిర్మించినదెవరు ?

కపాలి:—మాయాసంతానసంభవులు గదా మీరు?

శాక్య:—ఎంతసేపని నీతో తంటాలు పడేది? పుచ్చుకోవయ్యా స్వామీ దీన్ని !

కపాలి:—ఔను బాగుగా నున్నది. బుద్ధుఁడు కూడ నిట్లే దానపారమితను బూరించెను.

శాక్య:—దీన్ని ఇట్లా ఇచ్చివేస్తే నాకిక శరణ మేమి ?

కపాలి:—బుద్ధ, ధర్మ, సంఘములు.

పాశు:—ఈ వ్యవహారముఁ దేల్చుట నాచేతఁ గాదు. కనుక నీక నధికారులదగ్గఱకు వెళ్లవలసినదే.

దేవసోమ:—సామీ ! అలాగైతే ఈ కపాలాని కోదణ్ణం.

పాశుప:—ఏమని నీయభిప్రాయము ?

దేవసోమ:—ఇతగాడైతే, చక్కాగా ఒక్క విహారంలోనే ఉండి భోగా లనుభవిస్తూ ఉంటాడు గనుక డబ్బింత వెనుక వేసుకు ఉంటాడు. వాళ్లు కోరినట్లు అధికార్లముఖాలమీద ఇంత విరజల్లగలడు. నాగతి ? పాముతోలూ బూడిదా, ఇదే విభవంగా ఉన్న దరిద్ర కాపాలికుణ్ణి పరిచరించే దరిద్రురాలికి నాకు ఉద్యోగుల కచేరీలలోకి పోవడానికైనా యోగ్యత ఉందా?

పాశు:—కాదు అట్లా కాదు.

గీ. సారగౌరవములు సజ్జాతిసంభూతి
స్థిరత మృదుత సౌరు తీరు గల్గి

వారు ధర్మభరము వహించుచున్నారు
స్తంభచయము మేలి సౌధమట్లు.

కపాలి:—అదిసరే. న్యాయవృత్తి గలవానికి దేని వల్లను భయ ముండదు.

శాక్య:—స్వామీ ! నీవు ముందునడు.

పాశు:—మంచిది. (అందఱుఁ బరిక్రమింతురు.)

(అంతట ఉన్మత్తకుఁడు ప్రవేశించును.)

ఉన్మత్త:—ఇదుగో ఇదుగో పాడు కుక్క, కలు కుట్లతో ఉన్న కపాలాన్ని నోట కరుచుకొని ఎత్తుకు పోతోంది. లంజెముండ కొడుక ! ఎక్కడికిపోతావు. ఇదిగో ఇప్పుడిది కపాలాన్ని పారవేశి నన్ను పీక డానికే ఎదురుగా దూకి వస్తోంది' ఇదిగో రాతితో దీని దంతాల్ని విరగ్గొడతాను. (రాతిని విసరును.) ఏమి కపాలాన్ని విడిచిపెట్టి పారిపోతున్నావు ? పిచ్చివెధవ ! పాడు కుక్క! ఇటువంటి శౌర్యం పెట్టు కోనా నన్నెదిరించ వచ్చావు ? ఊరబండి యెక్కి ఆకాశాని కెగిరి సముద్రుడితో కూడా రావణుణ్ణి చావగొట్టి బలవంతాన ఇంద్రుడికొడుకును తిమింగి లాన్ని పట్టుకొంటినిగదా ! నాతోనా ? ఏమీ ! ఆముదపు చెట్టూ ! ఏమంటావు ! ఉత్త అబద్ధం ఉత్త

అబద్ధం అంటావూ ? ఇదుగో రోకలికి మల్లే వెడల్పై ఎ వేలాడే చేతులుగల కప్ప నాకు సాక్షి ! కాక ముల్లోకాలా వెల్లడి అయిన పరాక్రమం గల నాకు సాక్షులతో ఏమి పని ! ఇట్లా చేస్తాను. కుక్క కొరికి విడిచిన మాంసఖండాన్ని కొఱుక్కు తింటాను. హా హా ! చంపేస్తోంది నన్ను బాష్పం. చంపేస్తోంది .ఎవడు వీడు నన్ను కొడుతున్నాడు ! కొంటెకుంకల్లారా ! నే నెవడికో ఓడికి మేనల్లుణ్ణి. భీమసేనుడికి ఖటోత్కచుడి మల్లే. ఇంకా వినండి !

శూలాలు పట్టుకోని
చాలా వేషాల్ వేసికోని
వేల కొద్దీ పిశాచాలు
వెళ్తూ ఉంటై నాపొట్టన,
పెద్దపుల్లూ వందలకొద్దీ
దద్దరిల్తూ ఉంటై నాతో
గద్దరి తాచుల్ చిట్టుల్ బుస్సుల్
కావిస్తుంటై నా నోట్లో.

ఏమీ నన్ను ఏడిపిస్తున్నారా ? దయ తలచండి దయతలచండి కుఱ్ఱదొరల్లారా ! ఈ మాంసఖండం

కోసం నన్ను బాధించకండి! (ముందుకు జూచి) ఇదుగో మా ఆచార్లు శూరనంది! ఈయన్ని చేర బోతాను.

పాశుపతుడు:—ఓహో! వీఁడుగో ఉన్మత్తకుఁడు ఇల్లై ఎదురు వచ్చుచున్నాఁడు.

సీ. చీకిరిబాకిరి చింపిరిమసిపాత
లట్టిట్టుగా మేనఁ జుట్టినాఁడు
కలుకులై చెడిన జుంజురు వెండ్రుకలు గోకి
బికి నెత్తిపైఁ బోద వెట్టినాఁడు
బూడిదధూళితో వాడివీడిన పూల
దండలు ఱొమ్మపైఁ దాల్చినాఁడు
కాపుకావనుచుఁ గాకములు పైఁ దిరిగిరా
నెంగిలాకులు చే వహించినాఁడు
ఊరిఁకో రోఁతగొల్పెడు గోరములును
చెత్తచేదారములు నొక్కమొత్తమై వి
కారబీభత్స మానుషాకార మొందె
నేమొకోయన నున్నవాఁడిసిరో వీఁడు!

ఉన్మత్తకుఁడు:—ఈయన్ని చేరబోతాను. (చేరఁబోయి) మహాసాధువయిన చండాలపు కుక్కదగ్గ

ర్నుండి నాకు లభించిన యీ కపాలాన్ని స్వామి ప్రతి గ్రహించాలి !

పాశుపతుడు:—(దృష్టి క్షేపముతో) తగ్గవారికి అర్పింపుము.

ఉన్మత్త—(భిక్షువును చూచి) మహాబ్రాహ్మణ! అనుగ్రహించాలి !

శాక్యభిక్షువు:— ఈ మహా పాశుపతుడింముకుదగ్గ వాడు.

ఉన్మత్త:—(కపాలిని చేరఁబోయి కపాలమును నేలమీఁదఁ బెట్టి ప్రదక్షిణించి పాదములపైఁ బడి) మహాదేవ ! అనుగ్రహించాలి ! ఇదిగో చేతులు జోడి స్తున్నాను.

కపాలి:—మాది కపాలము.

దేవసోమ:—అవును అంతే. ఇది మాదే.

కపాలి:—భగవత్పరిపాదమువల్ల మరల నేను కపాలి నయితిని. (తీసికోఁ గోరును.)

ఉన్మత్త—లంజా కొడకా ! విషం తిను. (కపా లమును గుంజుకొనిపోవును.)

కపాలి:—(వెంటాడి) ఈయములాఁడు నా ప్రా ణము నెత్తుకొని పోవుచున్నాఁడు. అడ్డగించుఁడయ్యా మీ రిద్దఱున్న.

ఉభయులు:—కానీ, మే మిద్దఱము నీకు సాయ మయ్యేదము. (అందఱు అడ్డగింతురు).

కపాలి:—ఓయి ! నిలు నిలు !

ఉన్మత్తకుఁడు:—ఎందుకు నన్నడ్డగిస్తారు !

కపాలి:—మాకపాలమును మాకిచ్చి వెడలుము.

ఉన్మత్తకుఁడు:—మొద్దూ ! కళ్లు కనపడడం లేదా! ఇది బంగారు గిన్నె కాదూ ! కపాలమంటావేమి !

కపాలి:—ఇటువంటి బంగరు గిన్నె నెవరు చేసిరి ?

ఉన్మత్త:—వీడీ బంగారువన్నెబట్టలు కప్పుకొన్న బంగారు పనివాడు చేశాడనీ, స్వామీ ! యిది బంగారు గిన్నె అనీ విన్నవించుకొంటున్నాను.

శాక్య:—ఏమంటున్నావు ?

ఉన్మత్తకుడు:—బంగారుగిన్నె అంటున్నా.

శాక్య:—ఏమి యితడు పిచ్చివాడా ?

ఉన్మత్తకుడు:—పిచ్చివాడు పిచ్చివాఁడు అని చాలాసార్లీమాట వింటూ ఉంటాను. దీన్నితీసుకొని పిచ్చివాణ్ణి చూపించు. (కపాలికి కపాలము నిచ్చును.)

కపాలి:—(కపాలముగైకొని) వీఁడిదిగో గోడ చాటయినాఁడు. శీఘ్రముగా రండి !

ఉన్మత్తకుడు:—లబ్ధప్రసాదు ణ్ణయినాను. (వడిగా ఉన్మత్తకుఁడు నిష్క్రమించెను.)

శాక్య:—అహో ! ఆశ్చర్యము ! పరపక్షమునకు లాభము కలుగుటచే నాకు పరితోషమయింది.

కపాలి:—(కపాలమును గాఁగిలించుకొని.)

మ_త్త. నేనఖండ తపంబొనర్చితి
నిక్కువంబ, మహేశ్వరుం
డానతప్రియుఁ డిచ్చె మెచ్చె న
హా! మహాద్భుతభక్తికిన్
కానరాక యెటో చనెన్ గద
కష్టుఁ డున్నఁడుఁ డప్పహా ?
ప్రాణతుల్యమ ! సేమమాయెఁ, క
పాలమా! నినుఁ గాంచితిన్.

దేవసోమ:—స్వామీ ! చంద్రుణ్ణి పొందిన ప్రదోషాన్నివలె మిమ్మల్ని చూచి నా చూపు ఆనందిస్తోంది!

పాశుపతుడు:—అదృష్ట వంతుఁడవు ! వర్ధిల్లుము.

కపాలి:—మీదే సుమండి అభ్యుదయము !

పాశు:—(స్వగతము) సత్యము సుమా ! పాపము లేనిచోట భయముండదనుమాట; ఇప్పుడ భిక్షువు పులినోటనుండి బయటఁబడ్డాఁడు. (ప్రకాశము) ఇదిగో నే నిప్పుడే సుహృదభ్యుదయ కృతమయిన యానం

దయును బురస్కరించుకొని, పూర్వస్థలీ నివాసియగు భగవంతుని ధూమవేళను జూడఁ బోయెదను. నేఁడు మొదలుగా నింక నిదియును గుదురుగాక.

గీ. పెద్దతడవు మీాను నిద్దఱకును నేఁడు
తారసిల్లినట్టి వైర మిదియు
ప్రీతిరూపమై కిరాతార్జునులకును
బోలె శాశ్వతముగఁ బొలుచుఁగాక.

(పాశుపతుఁడు నిష్క్రమించెను.)

కపాలి:—ఓయి నాగసేన! నేను అపరాధిని గాన నాయపరాధమును క్షమింప వలసినదిగా వేఁడుకొను చున్నాను.

శాక్య:—ఇదికూడా కోరవలెనా? ఇంకా నీకేమి ప్రియమో కోరుకో.

కపాలి:—స్వామికి నాపై ననుగ్రహము కలిగెనా? ఇంక నాకు వేఱ కోరఁదగిన దేది?

శాక్య:—నే నింక వెళ్తాను.

కపాలి:—ప్రియా! దేవసోమా! మనమును వెళ్లుదము.

(భరతవాక్యము.)

ఉ. అన్వహముఁ ద్విజాళి నిగ
మాభ్యసనంబొనరించుతన్ హుతం
బు న్వహియించుతన్ ప్రజల
భూతికినై జ్వలనుండు, పాలచే
పు న్విడకుండ గోవు లెగు
పుం గనుతన్, గలకాల మిర్వ రా
జన్వతియాత మితి యుబ
సౌఖ్యము వర్ధిల శత్రుమల్లుచేన్.

(Reprinted from "Chandrika" Jan. 1934)

